## అథ సప్తమో%ధ్యాయః

## శివుడు అనుగ్రహించుట

సనత్కుమార ఉవాచ |

ఏతచ్ఛ్రుత్వా తు సర్వేషాం దేవాదీనాం వచో హరః | అంగీచకార సుప్రీత్యా శరణ్యో భక్తవత్సలః || 1

ఏతస్మిన్నంతరే దేవీ పుత్రాభ్యాం సంయుతా శివా | ఆజగామ మునే తత్ర యత్ర దేవాన్వితో హరః || 2

అథాగతాం శివాం దృష్ట్వా సర్వే విష్ణ్వాదయో ద్రుతమ్ |
ప్రణ   మురతినమ్రాస్తే విస్మితా గతసంభ్రమాః || 3

ప్రోచుర్జయేతి సద్వాక్యం మునే సర్వే సులక్షణమ్ |
తూష్ణీమాసన్నజానంతస్తదాగమన కారణమ్ || 4

సనత్కుమారుడిట్లు పలికెను -

శరణాగతవత్సలుడు, భక్తప్రియుడు అగు హరుడు దేవతలందరి ఈ మాటను విని పరమప్రీతితో అంగీకరించెను (1). ఓ మహర్షీ! ఇంతలో పార్వతీదేవి పుత్రులిద్దరితో గూడి, శివుడు దేవతలతో గూడియున్న స్థలమునకు విచ్చేసెను (2). అట్లు విచ్చేసిన పార్వతిని గాంచి విష్ణువు మొదలగు దేవతలందరు ఆశ్చర్యముతో తొట్రుపాటు పడిరి. వారు వెంటనే పరమవినయముతో ఆమెకు ప్రణమిల్లిరి (3). ఓ మహర్షీ! వారందరు ' జయమగు గాక!' అను శుభవాక్యమును చక్కగా పలికి మిన్నకుండిరి. ఆమె వచ్చుటకు గల కారణమును వారెరుంగరు (4).

అథ సర్వైస్స్తు తా దేవైర్దేవ్యద్భుత కుతూహలా | ఉవాచ స్వామినం ప్రీత్యా నానాలీలా విశారదమ్ || 5

అపుడు దేవతలందరిచే స్తోత్రము చేయబడిన ఆ దేవి అధికముగు కుతూహలము గలదై, అనేక లీలలను వెలయించుటలో నిపుణుడగు శివస్వామిని ఉద్దేశించి ప్రేమతో నిట్లు పలికెను (5).

దేవ్యువాచ |

క్రీడమానం విభో పశ్య షణ్ముఖం రవిసన్నిభమ్ | పుత్రం పుత్రవతాం శ్రేష్ఠ భూషితం భూషణైర్వరైః || 6

ఇత్యేవం లోకమాత్రా చ వాగ్భి స్సంబోధితశ్శివః | న య ̧ ° తృప్తి మీవానః పిబన్ స్కందాననామృతమ్ || 7

న సస్మారాగతాన్ దైత్యాన్ని జతేజో నిపీడితాన్ | స్కందమాలింగ్య చాఘ్రాయ ముమోదాతి మహేశ్వరః || 8

జగదంబాథ తత్రైవ సంమంత్ర్య ప్రభుణా చ సా | స్థిత్వా కించిత్సముత్తస్థౌ నానాలీలావిశారదా || 9

దేవి ఇట్లు పలికెను -

పుత్రులు గల వారిలో శ్రేష్ఠుడవగు హే ప్రభో! సూర్యుని వలె ప్రకాశించువాడు, శ్రేష్ఠములను ఆభరణములచే అలంకరింపబడిన వాడు అగు షణ్ముఖుని ఆటపాటలను పరికించుము. నీ కుమారుని గాంచుము (6). జగన్మాతచే ఇట్టి వచనములతో సంబోదింపబడిన వాడై, పరమేశ్వరుడగు శివుడు స్కందుని ముఖమును చిరకాలము చూచి ఆనందించెను. ఎంత చూచిననూ ఆయనకు తనివి తీరలేదు (7). తనను ఆరాదించి పొందిన తేజస్సు గల రాక్షసులచే మిక్కిలి పీడింపబడి తనను శరణు జొచ్చిన దేవతల సంగతిని ఆయన విస్మరించెను. ఆ మహేశ్వరుడు స్కందుని కౌగిలించు కొని ముద్దాడి మిక్కిలి ఆనందించెను (8). అనేక లీలలను ప్రకటించుటలో నిపుణురాలగు ఆ జగన్మాత అపుడు శివునితో సంప్రదించి కొంత సమయము అచటనే ఉండి, తరువాత లేచి నిలబడెను (9).

తతస్స నందీ సహ షణ్ముఖేన తయా చ సార్థం గరిరాజపుత్ర్యా |

వివేశ శంబుర్భవనం సులీలః సురైస్సమసై#ౖ రభివంద్యమానః || 10

ద్వారస్య పార్శ్వతస్తస్థుర్దేవ దేవస్య ధీమతః | తే%థ దేవా మహావ్యగ్రా విమనస్కా మునే %ఖిలాః || 11

కిం కర్తవ్యం క్వ గంతవ్యం కస్స్వ్యా దస్మత్సుఖప్రదః | కిం తు కిం త్వితి సంజాతం హా హతాస్స్మేతి వాదినామ్ || 12

అపుడు చక్కని లీలలను వెలయించు శంభుడు, దేవతలందరు నమస్కరించు చుండగా, నందీశ్వరుడు, షణ్ముఖుడు మరియు హిమవత్పుత్రి యగు ఆ జగన్మాతలతో గూడి భవనములోపలికి ప్రవేశించెను (10). ఓ మహర్షీ! అపుడు దేవతలందరు మనసు చెడి మిక్కిలి కంగారు పడినవారై, దీమంతుడు, దేవదేవుడు అగు శివుని భవనము యొక్క సింహద్వారమునకు ప్రక్కన నిలబడి యుండిరి (11). ఏమి చేయవలెను? ఎచటకు పోవలెను? మనకు సుఖమును కలిగించు వారెవరు ? ఏమైనది? ఏమైనది? అయ్యో! మనము హతులమైతిమి అని వారు పలుకుచుండిచి (12).

అన్యోన్యం ప్రేక్ష్య శక్రాద్యా బభూవ శ్చాతి విహ్వలాః | ప్రోచుర్వికల వాక్యం తే దిక్కుర్వంతో నిజం విధిమ్ || 13

పాపా వయమిహేత్యన్యే హ్యభాగ్యాశ్చేతి చాపరే | తే భాగ్యవంతో దైత్యేంద్రా ఇతి చాన్యే%బ్రువన్ సురాః || 14

తస్మిన్నేవాంతరే తేషాం శ్రుత్వా శబ్దాననేకశః | కుంభోదరో మహాతేజా దండేనాతాడయత్సురాన్ || 15

దుద్రువుస్తే భయావిష్టా దేవా హా హేత వాదినః | అపతన్మునయశ్చాన్యే విహ్వలత్వం బభూవ హ || 16

ఇంద్రాది దేతలు ఒకరినొకరు చూచుకుంటూ చాల కంగారు పడిరి. వారు తమ విధిని నిందిస్తూ దుఃఖపూర్ణమగు వాక్యములను పలుకు చుండిరి (13). 'మనము పాపాత్ములము' అని కొందరు దేవతలు పలికిరి. మనము అభాగ్యులమని మరికొందరు పలికిరి. ఆ రాక్షసరాజులు భాగ్యవంతులని ఇంకొందరు దేవతలు పలుకుచుండిరి (14). ఇంతలో అనేక బంగుల శబ్దమును చేయుచున్న దేవలను గాంచి వారి శబ్దమును విని కోపించిన

మహాతేజస్వియగు కుంభోదరుడు వారిని దండముతో కొట్టెను (15). ఆ కొట్లాటలో దేవలు హాహాకారమును చేస్తూ పరుగులు దీసిరి. మునులు క్రిందబడిరి. అంతటా గందర గోళము నెలకొనెను(16).

ఇంద్రస్తు వికలో%తీవ జానుభ్యా మవనీం గతః | అన్యే దేవర్షయో%తీవ వికలాః పతితా భువి || 17

సర్వే మిలిత్వా మునయస్సురాశ్చ సమమాకులాః | సంగతా విధిహర్యోస్తు సమీపం మిత్రచేతసోః || 18

అహో విధిబలం చైతన్మునయః కశ్యపాదయః | వదంతి స్మ తదా సర్వే హరిం లోకభయాపహమ్ || 19

అభాగ్యా న్న సమాప్తం తు కార్యమిత్యపరే ద్విజాః | కస్మా ద్విఘ్న మిదం జాతమిత్యన్యే హ్యతివిస్మితాః || 20

ఇంద్రుడు మోకాళ్ల మీద నేలపై బడి అతిశయించిన దుఃఖమును పొందెను. ఇతర దేవతలు మరియు మహర్షులు నేలపైబడి దుఃఖమును పొందిరి (17). మునులు మరియు దేవతలు చాల ఆందోళనను చెందిన వారై అందరు సమగూడి ప్రేమతో నిండిన హృదయము గల బ్రహ్మ విష్ణువుల సమీపమునకు వెళ్లిరి (18). అప్పుడు కశ్యపుడు మొదలగు ఋషులందరు ప్రాణుల భయములను తొలగించే విష్ణువుతో ' ఆశ్చర్యము! విధి బలీయమైనది' అని పలుకుచుండిరి (19). అభాగ్యవశముచే మన పని సిద్ధించలేదని కొందరు ఋషులు పలికిరి. మరికొందరు మిక్కిలి ఆశ్చర్యమును పొందినవారై ' ఈవిఘ్నము ఏల కలిగినది? ' అని ప్రశ్నించుచుండిరి (20).

ఇత్యేవం వచనం శ్రుత్వా కశ్యపాద్యుదితం మునే | ఆశ్వాసయన్మునీన్ దేవాన్ హరిర్వాక్యముపాదదే || 21

ఓ మహర్షీ! కశ్యపుడు మొదలగు వారు పలికిన ఈ మాటలను విని, విష్ణువు మునులను, దేవతలను ఓదార్చుచూ ఇట్లు పలికెను (21).

విష్ణురువాచ |

హే దేవా మునస్సర్వే మద్వచశ్శ్రుణుతాదరాత్ | కిమర్థం దుఃఖమాపన్నా దుఃఖం తు త్యజతాఖిలమ్ || 22

మహ దారాధనం దేవా న సుసాధ్యం విచార్యతామ్ | మహదారాదనే పూర్వం భ##వేద్దుఃఖమితి శ్రుతమ్ || 23

విజ్ఞాయ దృఢతాతం దేవాః ప్రసన్నో బవతి ధ్రువమ్ | శివస్సర్వ గణాధ్యక్ష స్సహసా పరమేశ్వరః |

విచార్యతాం హృదా సర్వేః కతం వశ్యో భ##వేదితి || 24

ప్రణవం పూర్వముచ్చార్య నమః పశ్చాదుదాహరేత్ | శివాయేతి తతః పశ్చా చ్ఛుభద్వయమతః పరమ్ || 25

కురుద్వయం తతః ప్రోక్తం శివాయ చ తతః పునః | నమశ్చ ప్రణవశ్చైవ మంత్రమేవం సదా బుధాః || 26

విష్ణువు ఇట్లు పలికెను -

ఓ దేవతలారా! మునురాలా! మీరందరు నా మాటను శ్రద్ధతో వినుడు. మీరేల దుఃఖించు చుంటిరి? మీరు దుఃఖమును పూర్తిగా విడువుడు (22). ఓ దేవతలారా! మహాత్ముల ఆరాధన సరళము గాదు. ఆలోచించుడు. మహాదేవుని ఆరాధనలో ఆరంభము నందు దుఃఖము కలుగునని పెద్దల వలన విని యుంటిమి (23). ఓ దేవతలారా! మీరు దృఢచిత్తులై యున్నచో, గణములన్నింటికీ అధ్యక్షుడు, పరమేశ్వరుడు అగు శివుడు మీ భక్తిని గాంచి వెంటనే ప్రసన్నుడగుట నిశ్చయము. శివుడు నిశ్చయముగా మనకు ప్రసన్నమయ్యే ఉపాయమును మీరు మనస్సులో ఆలోచించుడు (24). ''ఓం నమః శివాయ శుభం శుభం కురు కురు శివాయ నమః ఓం'' అను మంత్రమును సర్వదా జపించవలెనని పండితులు చెప్పుచున్నారు (25,26).

అవర్తధ్వం పునర్యూయం యది శంభుకృతే తదా | కోటి మేకం తథా జప్త్వా శివః కార్యం కరిష్యతి || 27

ఇత్యుక్తే చ తదా తేన హరిణా ప్రభవిష్ణునా | తథా దేవాః పునశ్చ క్రుర్హరస్యారాధనం మునే || 28

సంజజాప హరిశ్చాపి సవిధిశ్శివమానసః | దేవానాం కార్యసిద్ధ్యర్థం మునీనాం చ విశేషతః || 29

ముహుశ్శివేతి భాషంతో దేవా ధైర్యసమన్వితాః | కోటి సంఖ్యం తదా కృత్వా స్థితాస్తే మునిసత్తమ || 30

ఏతస్మిన్నంతరే సాక్షాచ్ఛివః ప్రాదురభూత్స్వయమ్ | యథోక్తేన స్వరూపేణ వచనం చేదమబ్రవీత్ || 31

మీరు శివుని అనుగ్రహమును కాంక్షించువారైనచో ఈ మంత్రమును కోటి పర్యాయములు జపించుడు. అపుడు శివుడు మీ కార్యమును నెరవేర్చగలడు (27). ఓ మహర్షీ! సర్వసమర్థుడగు ఆ హరి అపుడిట్లు పలుకగా దేవతలు మరల శివారాధనను చేయ మొదలిడిరి (28). దేవతల యొక్క మరియు విశేషించి మహర్షుల యొక్క కార్యము సిద్ధించుట కొరకై విష్ణువు మరియు బ్రహ్మ శివుని మనస్సునందు నిలిపి జపమును చేసిరి (29). ఓ మహర్షీ! దేవతలు ధైర్యమును వహించి పలుమార్లు శివనామమును ఉచ్చరిస్తూ కోటి మంత్రజపమును చేసి నిరీక్షించుచుండిరి (30). ఇంతలో శివుడు పూర్వమందు వర్ణింపబడిన రూపముతో స్వయముగా ప్రత్యక్షమై ఇట్లు పలికెను (31).

శ్రీ శివ ఉవాచ|

హే హరే హే విధే దేవా మునయశ్చ శుభవ్రతాః | ప్రసన్నో%స్మి వరం బ్రూత జపేనానేన చేప్సితమ్ || 32

శ్రీ శివుడిట్లు పలికెను

ఓ హరి! విధీ! దేవతలారా! మునులారా! మీరు శుభకరమగు వ్రతము నాచరించితిరి. మీరు చేసిన ఈ జపమచే నేను ప్రసన్నుడనైతిని. మీకు అభీష్టమైన వరమును కోరుకొనుడు (32).

దేవా ఊచుః |

యది ప్రసన్నో దేవేశ జగదీశ్వర శంకర | సురాన్ విజ్ఞాయ వికలాన్ హన్యతాం త్రిపురాణి చ || 33

రక్షాస్మాన్ పరమేశాన దీన బంధో కృపాకర | త్వయైవ రక్షితా దేవాస్సదాపద్భ్యో ముహుర్ముహుః || 34

దేవతలిట్లు పలికిరి -

ఓ దేవ దేవా! జగన్నాథా! శంకరా! దేవతల ఈ దుఃఖమును నీవు గాంచితివి. కాన త్రిపురాసురులను సంహరించుము (33).

ఓ పరమేశ్వరా! దీనబంధూ! మమ్ములను రక్షింపుము. దేవతలను అనేక పర్యాయములు ఆపదల నుండి రక్షించినవాడవు నీవే (34).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్తం వచనం తేషాం శ్రుత్వా స హరివేధసామ్ |
విహస్యాంతస్తదా బ్రహ్మన్ మహేశః పునరబ్రవీత్ || 35

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ మహర్షీ! బ్రహ్మ విష్ణువులతో గూడియున్న వారి ఆ మాటలను విని మహేశ్వరుడు తనలో నవ్వుకొని వారితో నిట్లనెను (35).

మహేశ ఉవాచ |

హే హరే హే విధే దేవా మునయశ్చాఖిలా వచః | మదీయం శృణుతాదృత్య నష్టం మత్వా పురత్రయమ్ || 36

రథం చ సారథిం దివ్యం కార్ముకం శరనముత్తమమ్ |
పూర్వమంగీకృతం సర్వముపపాదయతాచిరమ్ || 37

హే విష్ణో హే విధే త్వం హి త్రిలోకాధిపతిర్ధ్రువమ్ | సర్వసమ్రాట్ ప్రకారం మే కర్తు మర్హసి యత్నతః || 38

నష్టం పురత్రయం మత్వా దేవసాహాయ్య మిత్యుత | కరిష్యథః ప్రయత్నేనాధికృతౌ సర్గ పాలనే || 39

అయం మంత్రో మమాపుణ్యో మత్ప్రీతిజనకశ్శుభః | భుక్తి ముక్తి ప్రదస్సర్వ దశ్చైవకాహవమ్ || 40

మహేశ్వరుడిట్లు పలికెను -

హే హరీ! విధీ! దేవతలారా! మునులారా! మీరందరు నా మాటను శ్రద్ధతో వినుడు. త్రిపురములు నశించినవనియే తలంపుడు (36). రథమును, సారథిని, దివ్యమగు ధనస్సును, గొప్ప బాణమును పూర్వము అంగీకరించిన విధంబున మీరు సమకూర్చుడు. ఈ సర్వమును శీఘ్రమే ఏర్పాటే చేయుడు (37). ఓ విష్ణూ! ఓ బ్రహ్మా! మీరు ముల్లోకములకు అధిపతులు. సర్వమును శాసించు చక్రవర్తులు. కావున నాకు కావలసిన పరికరములను శ్రద్ధతో సముగూర్చుడు (38). క్రమముగా సృష్టి స్థితులయందు అధికృతులైన మీరిద్దరు త్రిపురములు నశించినవి అనియే తలపోయుడు. ఈ దేవకార్యమునందు శ్రద్ధతో సహకరించుడు (39). మహాపుణ్య ప్రదమగు ఈ శుభమంత్రము నాకు ప్రీతిని కలిగించి ఇహపరములను మాత్రమే గాక సర్వమును ఇచ్చి శివభక్తులకు ఆనందమును కలిగించును (40).

ధన్యో యశస్య ఆయుష్య స్స్వర్గ కామార్థినాం నృణామ్ | అపవర్గో హ్యకామానం ముక్తానాం భక్తిముక్తిదః || 41

య ఇమం కీర్తయేన్మంత్రం శుచిర్భూత్వా సదా నరః | శృణుయాచ్ఛ్రావయేద్వాపి సర్వాన్ కామానవాప్నుయాత్ || 42

సకామముగా జపించు మానవులకు ఈ మంత్రము ధన్యతను గూర్చి, కీర్తిని, ఆయుర్దాయమును, స్వర్గమును ఇచ్చును. నిష్కాములకు మోక్షమును ఇచ్చును. ముక్తులకు భక్తిని, ఆనందమును కలిగించును (41). ఏ మానవుడైతే శుచిగా నుండి సర్వదా ఈ మంత్రమును జపించునో, వినునో, లేదా ఇతరులకు వినిపించునో, అట్టి వాని కోర్కెలన్నియూ ఈడేరును (42).

సనత్కుమార ఉవాచ |

ఇతి శ్రుత్వా వచస్తస్య వివస్య పరమాత్మనః | సర్వే దేవా ముదం పరాపుర్హరి బ్రహ్మాదికం తథా || 43

సర్వవేదమయం దివ్య రథం పరమశోభనమ్ | రచయామాస విశ్వార్థే విశ్వకర్మా తదాజ్ఞయా || 44

ఇతి శ్రీ శివమహాపురాణ   రుద్ర సంహితాయాం యుద్ధ ఖండే దేవస్తుతిర్నామ సప్తమో%ధ్యాయః (7).

సనత్కుమారుడిట్లు పలికెను -

పరమాత్ముడగు ఆ శివుని వచనమును విని దేవతలందరు ఆనందించిరి. విష్ణువు మరియు బ్రహ్మ గొప్ప ఆనందమును పొందిరి. (43). వారి ఆజ్ఞచే విశ్వకర్మ లోకక్షేమము కొరకై సర్వవేద ప్వరూపము, పరమ సుందరమునగు దివ్య రథమును నిర్మించెను (44).

శ్రీ శివ మహాపురాణములోని రుద్ర సంహిత యందు యుద్ధ ఖండములో దేవస్తుతి అనే ఏడవ అధ్యాయము ముగిసినది (7).